

ప్రకటన.

ఇవి మొదలుగాగల సంస్కృతాంధ్ర గ్రంథములున్ను సూట్లు పుస్తకములు వగైరాలున్ను వలయువారు రాజమంద్రి యింటవసీతి, శ్రీను, కర్రా. అప్పయ్యగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

శ్రీ ర స్తు.

# హరికథేతిహాసమంజరి.

ఇది,

నిత్యం హరికథా శ్రవణానందమును కలుగజేసెడు
హరిభక్తులకున్ను, తదితరులకున్ను, ఉత్సాహమును
కలుగజేయునటుల జ్ఞానరసంబున్ గుమ్మరించి పరలోక
సౌఖ్యంబునకు మూలమగునటుల



చెల్లూరి నివాసులగు
గరిమెళ్ల - శివరామదాసుగారిచే రచియింపఁబడి.
రాజమహేంద్రవర నివాసులగు
కర్రా - అచ్చయ్యగారిచే


చెన్నపట్టణము. చాకలపేటపోస్టు.
నెం. ౨౧ కొల్లావారి అగ్రహారమునందుండు
పమ్మి- త్యాగరాయసెట్టిగారి,
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

౧౯౦౪ సం॥ వెల. 3 అణాలు.



## పీఠిక.

ఈ అద్భుత గ్రంథము ఆంధ్ర జనుల అదృష్ట వశంబున బయలు వెడలినదని తప్పక చెప్పవచ్చును.

ఆర్యులారా! భక్తులారా! మానవజన్మంబెత్తినందు కేయుపాయము చేతనైనను భగవంతుని ధ్యానంబుచేసి ముక్తి పొందుటకు మనకు ఆవశ్యకమైయున్నది. దానికి, కారకుండు శాంతాకారుండును, చతుర్భుజుండును, శంఖ, చక్ర, గదా, పద్మాసన, మాల్యాద్యలంకృత, దివ్య, మంగళవిగ్రహుండగు నాపరమపురుషుని మనంబున, దలపోయుట కర్తవ్యంబుకెట్లన! మహానుభావా! త్రిమూర్త్యాత్మకస్వరూప, త్రిగుణాతీత, నిరంజన, నిర్వికార, నిర్గుణ,సగుణ,ఆదిమధ్యాంతరహిత అచ్యుత, అనంతకళ్యాణగుణాధార, శ్రీమన్నారాయణ యని వినుతిచేసినయనేక విధంబులవేడుటవిని పాపనివారకుండు, పరమానందంబునను జెంది మనుజులు నానావిధయోనులంజనించుచు నానావిధ దుఃఖంబు లనుభవించుచు జన్మాంతరపాపంబులచే, ఖేదము లనుభవించుచున్నారని, అనంతకళ్యాణునికి, దయవచ్చును, అట్టిదయకు, మనముపాత్రుల మగుదుము, అట్టి మార్గమునుపొడచూపుటకు, సూక్ష్మముగా, గ్రంథవిస్తారము లేకుండా ఈపుస్తకమును పామరులకున్ను స్త్రీలకున్ను,పురుషులకున్ను, భక్తులకున్ను, ఉపయోగించునటుల అనేకముఖ్యవిషయములను. యుక్తియుక్తముగను. ఉదాహరణపూర్వకముగను ఉపమాన కథలతోను, తేటతెనుగు మాటలతో వ్రాయబడినది. గానకథాసందర్భములకు, ఈకథలు చదువుటవలన,వాక్చాతుర్యము, చమత్కారమ్ము,ఆనందము,అద్భుతమైనభక్తి, నీతి, శృంగార రసము, మనోహరము, మొదలైనవి కలుగుటయేగాక.

దీనియొక్క అభిప్రాయమేమన, భక్తుడు (హరికథ) ఆరంభించి, భగవంతునిచరిత్రంబు చెప్పటలో, కొంతమందిపామరులు, నేర్చుకున్నది. నేర్చుకున్నట్టె చెపుతూయున్నాడు. దీనిలోయతిహాసము లేవు. అనుపామరులకు కాలక్షేపమగునటుల కొంతమందినాస్నేహితులు ప్రోత్సాహపరుపగా, ఈపుస్తకమును, అచ్చువేయించినాడను. అట్టిలోపము. దీనితో తీరునని నేనుచెప్పకలను, గానవారచాట్లు. రెండవకూర్పునందు సవరణచేయించెదను, లోపములకు పాత్రుడనుగాన క్షమింపవేడుచున్నాడను.

☞ (ఈఅర్థానుస్వారముగా గుర్తువేసినచోట, శ్లోకములుగాను, పద్యములులాగున, చదువవలెను.

ఇట్లు,

విన్నవించు భక్తజనవిధేయుడు.

☞ కరిమెళ్ల - శివరామదాసు.



  

శ్రీ ర స్తు.

శ్రీ వేణుగోపాలసహాయము.



# హరికథేతిహాసమంజరి.



## విఘ్నేశ్వరప్రార్థన.

మత్తకోకిల. శ్రీగణాధిపు లోకవందితు చిత్రజారి తనూభవున్।
నాగవక్త్రుని ఏకదంతుని నవ్యకాంచన దేహునిన్।
నాగభూషణు వామనాంగుని నామనంబున వేడెదన్।
వేగమే గృతి పూర్తియౌటకు విఘ్నముల్ నశియింపగన్॥



సరస్వతిప్రార్థన.

మత్తకోకిల. శారదన్నుత ధీవిశారద సర్వశబ్ద విశారదన్।
వారిజాక్షిని గీరవాణిని వారిజాత్మజురాణినిన్।
నీరజానన గోమలాంగిని నీలనీరద వేణినిన్।
భారతీసతి నెల్లవేళలఁ బ్రస్తుతించెద నామదిన్॥

## 1—వ కథ ప్రారంభము.





సభవారితో చెప్పుట.

ఓసభికులారా! భరతఖండమునందునొకరమ్య పురముగలదు; అప్పుర ములో చదువుకున్న విద్వాంసుఁడొకఁడు కలడు. అతఁడు కాశీయాత్రకుపోవు

యున్నసమయములో దక్షిణదేశంబునుంచినొకచదువుకున్నవిద్వాంసుఁడు బయలుదేరిరాబోవుసమయములో ఈయిద్దరునుఒకచోటచేరి ఓహో! మీరెందాకపోవుచుంటిరి, అని ఒకరినొకరు కుశలప్రశ్నలు చేసుకొనినేను కాశీయాత్రకు బోవుచున్నాఁడను. అని మొదటివాఁడు, రెండవవాఁడు అట్లేచెప్పెను.సుగుణకల్యాణుండగు చెల్లూరి- గోపాలునిదలచిదలచుచు ఒకచోటచేరి భోజనముచేసి రైలు ష్టేశనుదగ్గిరకు వచ్చిటిక్కెట్లు తీసుకొనిరి.ఇంతలోక్ష్టేశనులోకి రైలువచ్చిచేరెను.యింతలోవీరు (ఎక్కువ సంగతి) వీరిద్దరికి ఒకసందేహముఏకకాలమందేకలిగెను? ఏమన! మొదటవీరుమర్యాదలు చేసుకొనలేదు. యిప్పుడుమొదటివాఁడు రెండవవానిని మీరుయనుబడిరెండుపన్నములయందును చదువుకొన్న సమర్థులైయుండగా! తమరుకూర్చున్నతరువాత నేనుకూర్చుండెదననిపలికెను. అయ్యో! మీరు తర్క-మీమాంసములయందు ఘనులై యుండగా! మీరుదయచేసి కూర్చున్న నేనుకూర్చుండెదననిపలికెను.యిట్లిద్దరు ఘోరమైనఆలోచనచేయుచుండగా రైలు ష్టేశనువదలి వెళ్లెను. యీయిద్దరురైలుఎక్క-లేదు.

గాన సభికులారా! భూలోకము నందు, చదువుకున్న వారిలో తెలివి తక్కు-వయుండగా చదువులేనివారియందుయుండుటఆశ్చర్యమా? గాన యీసమయమందున భగవంతునిగూర్చి చరిత్రంబు చెప్పుటలోకొంతమందిమహానుభావులు కాలమువృధాపుచ్చి లేనిపోనిమీమాంసలుచేయు మహానుభావులును యీవిద్వాంసులును ఒకటేక్లాసుగా చేర్చుటకు ఏమి సందేహమున్నది గాన యింతటితో ముగించ దలచియున్నాడను.

---

## 2—వ కథ హరికథనుగురించునది.

ఓసభికులారా! హరికథ జరుగు కాలములో అనేకమంది మహానుభావులు వచ్చుటకద్దు అందులో కొంతమందికి అనేక సందేహములు



కలుగవచ్చును, ఒకగ్రామమునందు ఒకహరిభక్తుడు హరికధ కాలక్షేపముచేయుచుండగా! కధాసందర్భమునుబట్టి (శివాయవిష్ణురూపాయశివరూపాయ విష్ణవే:— అను సూత్రమునుబట్టిచెప్పగా వ్యాపారముచేయువాఁడులేచి శివుడుకుబాకీయున్న రూపాయి విష్ణుయిచ్చినాడు. విష్ణుకు బాకీయున్న రూపాయి శివుడుయిచ్చినాడు. గానఒకరికొకరుయిచ్చుకున్నారు. గాన బాకీ సున్నని చెప్పెను. గానఓరిమూఢ హరిభక్తుండా? యికను నీవుచెప్పవలసిన సందేహమేమిటని అడిగెను. అనగా! హరిభక్తుండు అయ్యా! తమరు ఏమివిద్య అభ్యాశించినారని అడిగెను. వ్యవహారములయందు ప్రవీణుడను అనిచెప్పెను. సభికులారాయీమూఢునికి మనముబోధించునదేమిఅనిచెప్పి మూఢుని సంగతినిగురించి అటులుండనిమ్ము, అయ్యా! యిటువంటివారినిగురించి చెల్లూరినాధుండుతీర్చవలెనుగాన యిందలి విషయములుశ్రద్ధగా వినగోరెదను. స్వతంత్రునిగానెంచుకొని నాముద్దు పలుకులుమన్నించెదరని నానమ్మకము.







## 3—వ కథ. ఆశ్చర్యమైనకథ.

మూఢభక్తి యిట్టిదని తెలుపునది.

ఓసఖీమణులారా! శ్రీవిగ్రహస్వరూపుండగు విష్ణుమూర్తివారు. నారదులవారికి భక్తిమార్గమునుగురించి బోధించుచున్నారు. ఏమన! ఓ నారద, వినుము (తస్మాత్తు గాయకస్యమతస్య:— అనునట్లు నాసంబంధమైనకథలును, చరిత్రంబును, ఏభక్తుండుగాని, ఏనరుండుగాని, చెప్పుతారో అట్టి స్థలములయందు నేనువిహరింపుచునుండెదనని భగవంతుండు పలికి నాడని ఒకహరిభక్తుండు హరికథకాలక్షేపముచేయుచు సందర్భమును బట్టిచెప్పగా! వడ్డీవ్యాపారముచేయుషావుకారులేచిహరిభక్తుడా! రేపు మాయింట హరికథచేయుమనిచెప్పిపోయెను! మనస్సులోనిజముగా ట్లు జరుగునాయని అనుకుంటూ వెళ్లెను. మరునాడు రాత్రి హరికథజరుగు కాలములోఒకరి, మూఢహరిభక్తుండా! నిన్నరాత్రిఅలాగేచెప్పియుంటివి గదా! విగ్రహస్వరూపుండగుభగవంతుండేడః అమగుచూనిల్లనియె, ఏమ ఎనిమిదిరూపాయలుఖర్చుపోయి, చెప్పించుచుంటిభగవంతుండేడని అడుగగా! నాభక్తుండు యీమూఢునికి ఏమనిబోధించుదును, అనివిచారించి

ఓనాయనా! భక్తిహీనపురుష, ఓషావుకారు (మద్భక్తాయత్రగాయంతి తత్రతిష్ఠామినారదా:— అనునార్యోక్తిని భగవంతుండు నారదులవారితో చెప్పినట్లు పురాణములుపలుకుచున్నవిగాన నేనుచెప్పితినని చెప్పెను. సరి, సరి, యికను ఎన్నడును హరికధచెప్పించను. రూపాయలు వడ్డీకిచ్చుకుంటె పాయిదావచ్చును. ఇట్టిపాండిత్యబలముచేత యిటువంటి మాటలాడెను. గానసభికులారా? (కం॥ ఎవ్వడుసృజియించెజగమెవ్వనిలోను:—అనుపద్యము తమకేవిశదము. ఇదిఅంతా నాప్రజ్ఞయే యనుచు, భగవంతుడులేడు, అనుమూఢులున్ను ఈషావుకారున్ను యీయుద్దరిని మూఢులనుటకు ఏమిసందేహమున్నది.



4—వ కధ. జ్ఞానశూన్యులకు జ్ఞానముకలుగునది.
యోచించిచూడుము.

లోకములో, నొకగ్రామముకలదు. ఆపురికిసంతగలదు. ఆపూరిలో నొకగ్రహస్తుగలడు. అతడు, (శతసంవత్సరములు ప్రొద్దుగడపెన్:— అనునట్లు ప్రతిరోజున జాముతెల్లవారలేచి పొలము వెళుతూయుండడమున్ను రెండుపూటలభోజనమును, పొలములోనె య్యీలాగున, వయస్సునంతయుజరిగిపోయెను. కొన్నిదినములకు, వ్యాధిపీడచేత, యింటియందుండెను. సంతరోజున సంతగోలవినబడి, తనపెద్దకుమారునిబిలిచి నా

యనా ఊరు అంటుకున్నదాయని అడిగెను. లేదు. సంతసాగుచున్నదని చెప్పెను. అనగా సంతయేమిటి? అక్కడనేమిజరుగును. అనిచెప్పగావిన గోరెదనని నడిగెను. కుమారుండిట్లనియె. అక్కడికి దుకాణములు మొదలైనవివచ్చును. వర్తకులువచ్చెదరు. చాలామంది జనను వచ్చెదరు. మిరపకాయ, చింతపండు, మొదలుగా గల వస్తువులు కొని తీసకొని పోయెదరు; అనిచెప్పగా (చిత్రము) అక్కడవారందరు దెబ్బలాడతారా యనిన్ని కొట్టుకుంటారా యనిన్ని కుమారుని నడిగెను అరుణోదయము మొదలు సాయంతరము వరకు (సంసార సాగరం దుఃఖం:— అను నార్యోక్తిగా యితను కాలమంతయుగడపినవాడు సంతపెట్టెడుచోటును. ప్రపంచకజ్ఞానములేనివాడున్ను, కొంత విచారించవలసియున్నది, హరిస్మరణ చేసెడుచోటు కొంతమందినెరుగరు, గాన ప్రపంచములో యిట్టిమూఢులుంటారని చెప్పుటకేమి సందేహమున్నది వారివిషయమై కొంత్మమనము శ్రమపడె ఒకసారిమనమంవరము. భగవంతునిగూర్చి వేడుకొనవలయును. దానికికారణమేమన! (గోవిందనామకీర్తనం పాపవినాశకారణం:— అను నార్యోక్తినిబట్టి ఒక్కసారి (గోవింద, హరి, హరి, గోవింద, రాంరాం:—అనునట్లు ఒకసారి ఈకథాసందర్భమునుబట్టిఅనిపించుటకు వీలుగానున్నది చెల్లూరి గోపాలుడు చాలా సంతోషించును, గాన యీ సమయమే మంచిది. యింకొకసారి భజన సేయుడు, ముగించెదము.




## 5—వ కథ. వృత్తులుమారుటవలనగురించినది.

### నిత్యముఆలోచింపుడు.

ఒకగ్రామమునందిద్దరు బ్రాహ్మణులుం గలరు. వారిలోఒకడు లౌకికమందు, ప్రజ్ఞగలవాండును, రెండవవాండు వైదీకమునందును, ప్రజ్ఞగలవాండు, వీరిద్దరు త్వరలోభోజనముచేసి ఒకవ్యవహారము మాటలాడుటకున్నొకఘంటలో రావలెనని, నిశ్చయముచేసుకున్నవారై ఎవరియింటికి వారువెళ్లిరి లౌకికి యింటికివెళ్లి కాళ్లు కడిగినట్టు, కడగనట్లున్నను, తొందరచేతనున్ను తెలివిన్నైనవాండనుటకున్ను చేయవలసినవిధులుమాని పుంజీడుమెతుకులుతినేవి,అందులో మూడుమెతుకులుతినివచ్చెను. వైదీకి యెన్నవో సంధ్యావందనముమొదలైన అనుష్టానములు తీర్చుకొని భోజనముచేసివచ్చెను. (ఆశ్చర్యసంభాషణ) స్నేహితుడా; నేనువచ్చిచాల్లా సేపుఅయినది అనిపలికెను. అవును నిజమై యుండ వచ్చును నేనుసంధ్యావార్చుకుని భోజనముచేసి వచ్చితినసెను ఇంతలో సంధ్య ఏమిటని? అడిగను. దానివల్లఫలమేమి అది యెప్పుడుచెయ్యవలెను. ఎవరీ సంతోషించెదరు, ఇట్టిప్రశ్నలు వేసెను. వైదీకిఉదయమునమధ్యాహ్నమున, సాయంత్రమున తప్పకచేయవలెను. సూర్యోదయమునకు ముందుగా వార్చిన, సూర్యునికిప్రీతిన్నిఅటుతరువాతవార్చిన రాక్షసులకు,ప్రీతియని చెప్పెను. సాయంత్రము ప్రొద్దుగ్రుంకు వేళలయందు, వార్చిన సూర్యునికిప్రీతిన్ని, అటుతరువాత రాక్షసులకు ప్రీతనిచెప్పెను. (చమత్కారము) ఓప్రియస్నేహితుడా; నేనుయిద్దరినోట్లోనీ కర్ర గొట్టితినని చెప్పెను. కాబట్టి వృత్తులుమారుటవలనఏలాగునున్నవో ఆలోచింపదగ్గహంశమైయున్నది. (చిన్నమనవి) సత్కార్యములు ఏమహానుభావుడైనను జరిగించవలెనని ప్రయత్నింపబూనుకున్న వృత్తులవలన గలిగెడు భాధతనికి భంగమేనైయున్నది (బ్రాహ్మణోమమదేవత:— అను వేదశృతినిబట్టిన్ని జరిగేదేమంటే యీలాగున శ్రుతి చెప్పబడీ యున్నది గదాయని అఖరు వృత్తులలో. ప్రవేశింపుచూ అప్పుడైనను యీశ్రుతినే వినియోగించుచురట్లే శ్రుతివిచా

రించుచున్నది. హరికథ జరుగుకాలములయందు కొంతమందిమహానుభావులు లేనిపోని ప్రసంగములచేత ముక్తినిసాధింపలేక యిహమేనిజమనిన్ని ఎప్పుడు యీనరజన్మమేయనిన్ని అజ్ఞానమనెడు సముద్రములో మునుగుటకు పాత్రులగుచున్నారు.

యికను నేనుచెప్పవలసిన దేమున్నది, యింగ్లీషే ముఖ్యమనినమ్మక చెల్లూరుగోపాలుడెగతియనినమ్మి ముక్తినిబొందుటకుకోరుచున్నాడను.



**6**—వ కథ. వినోదమైనది.

అలవిలేనినవ్వువచ్చునది.

లోకములో యిద్దరుఅన్నదమ్ములుగలరు. అందులోయొకరికి, పనసపండు తినవలెనని, అభిలాసగలవాడై యుండెను. రెండవవాడుపండు సంపాద్యించి తెచ్చియిచ్చెను. యిదిఎలాగుతినవలెనని అడిగెను. అంతట రెండవవాడు కోసి పెడుతూమనముకూడ తినుసమయమే దనుకొనెను. అనుకొని తినుటకారంభించెను. తొనలుముగిసేటప్పటికి. మూడుతొనలు

మాత్రముండెను. అంతట మొదటికాఁడు. నాకు రెండు నీకుఒకటియనె ను. రెండవవాఁడీరీతిగానే పలికెను. యిట్లిద్దరదే ప్రకారముగా తగవు పెట్టుకొని ఒక ఖండీషన్ పెట్టుకొనెను! ఏమన! మనమిద్దరము పరుండి ముందుగా ఎవరులేచెదరో లేచునపుడుఅబ్బాయనీ, ఎవరుఅంటూలేచెద రోవారికిఒకటిఅని ఏర్పాటుచేసుకొని పరుండిరి, మరునాఁడుదయము న వీరిజాడయిరుగుపొరుగువారు కాననందున కొంతసేపువరకు చూచి అంతట కొంతమందిపిన్నపెద్దలుకలసి తలుపులయొక్క- ఉతకలనుయెత్తి చూడగా అట్లేపరుండియుండిరి. అప్పుడు వైద్యశాస్త్రముపయోగించిరి కానినిజము తేలలేదు, గాన కాటికితీసుకపోయిరి. అప్పుడైనను లేవలేదు. కా టిమీదపెట్టి నిప్పుఅంటించిరి. అప్పుడైననుతొనపోతుందనే పూర్వజ్ఞానమే కాని ప్రపంచవ్యక్తిఆవహించలేదు. కొంతసేపటికిపెద్దవాఁడుఅబ్బాయని లేచికూర్చుండెను అంతట రెండవవాఁడు, అన్నయ్యోయి, నీకుఒకటినాకు రెండు.యని కేకవేసెను- సామెత:— పుణ్యమునకుపోతే పాపం యెదు రైనట్టు:— వీరుచూచుచునేయుండిరి. యీపరివార జగమూ ఇదిఅంతా చూచి. అయ్యో! మనముచూచుచుండగనేయిద్దరు కూడా పిశాచములైమ నలను పంచుకుంటున్నారనీ అడలుచుకొంతమంది పడుచుకొంతమందిజడ సి. చచ్చుచు మిగిలినవారు ఊరుచేరుకుని యిండ్లలోప్రవేశించి తలుపులు బిగించుకొని నాలుగైదు దినములవరకు కిండ్లయందే తలుపులు తియ్యక యిండ్లయందే మలమూత్రము లిండ్లయందే జరుపు కొనుచుండిరి. యీ అల్లరి యీలాగునుండగా,

సర్కారుతరుపున నొకనౌకరు పూరియొక్క- స్థితిగతులు చూ డగా, వూరిలో శుణక దరిశనమేకాని నరదరిశనములేదు. యీసాహెబు గారు ఎవరుయింటికివెళ్లి పిలిచిన- ఏమండోయి నన్నును, పిల్లలను, తిన వచ్చినారా: బ్రతికియుండనియ్యండి, బ్రతికియుంటె బలుసుకూరతినిబ్ర తుకుదామనువారేకాని. యీనౌకరునుకుశలప్రశ్న చేయువారొకరును లేరైరి. అంతటఈనౌఖరు గ్రామములమీదతిరిగియున్నాఁడుగనుకగుడ్లు

మూసియున్నవి. గాన చాకిలివాడి యింటికివెళ్ళి వారేయి ఎవరాయింట్లోను అని కేకలు వేసెను యీకేకలువిని అయ్యా నన్నునుపిల్లలను దెయ్యములయి తినవచ్చినారా బాబూ కళ్లు గుడ్డలుకొట్టుకొని బ్రతుకువాడనని యీచాకలిపలికెను యిదిఅంతా వెఱ్ఱిగాకనపడెను ఆరేయి నేనుసర్కారునౌఖరునురా ఏమిరాభయములేదు, తలుపుతియ్యుమంటె భయములేకుండాయున్నావు. ( *I shall dismiss you from this service* ) అనుచువూరిలోఎవరుతీసినవారుకారు అని చెప్పుచుండగా చాకలిబాబుమాపెట్టెకుని రాకండి నౌఖరీపోయినాసరే బ్రతికియుంటె బలుసుకూర తింటామనిచెప్పగా విసిగి వేసారి మనము ఉతుకోవలసి యున్నదని తలచి తిన్నగా చాకి రేవులోకి బయలుదేరివస్తూ యున్నాడు, యిట్లుండగా,

అక్కడవారు లేచి మనమిప్పుడు. గ్రామములోకి పోయినయెడల మనలను కొట్టెదరనుకొని ఏమియుతోచక అక్కడసమీపములో చాకిరేవులోనున్న బానలు మాత వేసుకొని యిద్దరుకూర్చుండిరి యింతలోయీ నౌఖరు వెళ్లి. దుస్తులుఊడ్చి ఒకచెట్టుక్రింద బెట్టి యీబానలో నీళ్లు తెచ్చుకుని బట్టలు ఉతుగుదామనిబానలుయెత్తెను (తమాషా)యెత్తగా నేదిగంబరుగానున్న యీయనలేచి నిలవబడెను నౌఖరు (చిత్రము) అయిదుప్రాణములు భగవంతునికి బేరము యిచ్చి వేసెను ఆదుస్తులు వదలివేసి ఆరేయి, మీకు! సలాం, సలాం, సలాం, ముమ్మారు సలాముండోయని పరిగెత్తుచుండెను వెనుకవీరు ముందు నౌఖరు పరుగెత్తుచుండెను వీరి అభిప్రాయమేమన యీసమాచారము చెప్పవలెనని తలంపువీరిది వీడభిప్రాయమేమి నన్ను మింగవలెనని పరుగెత్తుకొని వస్తూయున్నారని రెండభిప్రాయములు వేరై యున్నవి. గాన వీరు ఒకచోట గూర్చుని (నుదుటన్ వ్రాసినవ్రాలు తప్పింప నూరేండ్లు చింతించి నది:— అనునట్లు ముందు సంగతి కాశీ పోవుట యిప్పట్లో మంచిదని ఏర్పరచుకొని కలసిపోయిరి. అక్కడ నాలుగైదు సంవత్సరములు ఉండి మరికొన్ని రోజులకు బయలుదేరి దేశములోకి వచ్చి వీరి స్వగ్రామమునకు సమీప గ్రామములో

బసజేసి యీసమా చారమంత వారితో చెప్పి స్వగ్రామము యొక్కపూ దు వెలపల నిలచి బంధువులకు వర్తమానము చేసి చేయగా నలుగురు తోటి నారాయణయనునట్లు:అందరుఆలోచించి ఒకట్రాణముతో మా ట్లాడిగానినిజము దీనసంరక్షకుడగు చెల్లూరినాధుని దలచిన వీరికింతభయ మేలగాన యింతటితో ముగించి ముందు కధాసంధర్భములో చెప్పెదను.



6—వ కథ. భక్తిభావము.

చూడతగినది, వేదాంతభావము.

ఓసభికులారా! నేను ఒకచారిత్రంబు చెప్పబూని యున్నాడను! గాన సావధానచిత్తులై వినగలందులకు మిక్కిలివేడుచున్నాడను. భక్తా గ్రగేసరుండును, విబుధజన విధేయుండును నగు శివమంత్ర శబ్దమును, రామదాసు గలడు ఈయనను ఉదరనిమిత్తం బహుకృతవేషం భజగోవిం దం, భజగోవిందం, మూఢమతే:— అనురీతిగాచిన్నలవుకిక వృత్తియం దు జీవనముచేయుచుండెను. చేయుచు ప్రాణములను కాపాడుకొను చుండెను. కాపాడుకొనుచు (దీనదయాపరధ్యానంబు నిత్యజీవనంబు:— అనునీతిని ననుసరించి భగవంతుని మీదనే ధ్యానముంచి ఏప్రొద్దు యిదే దృష్టిగా సంసారము గడుపుకోనుచుండగా! ఈయనకు సంసారమువల్ల బాధ కలుగకుండానున్ను, తదితరబాధలను వినక విరాట్టు స్వరూపుం

డగు నావిష్ణుమూర్తిని ధ్యానము చేయుచు (భక్తవత్సలుమీద భ్రాంతి వుంచి:— ఓ దీనదయాపరమూర్తి ప్రపంచ కారకులవలన బాధకలుగ వియ్యావద్దని మొరలిడు చుండగా! భక్తవత్సలుండగు నా భగవంతుండు మొరాలకించక వాండ్లపక్షమై యుండె గాన, అందరికి ఒక సందేహము కలుగవచ్చును. ఓరి వెర్రి హరిభక్తుండా! ఆమహాను భావుండు అనేక విధంబుల మొరలిడుచుండగా కనపడనివాఁడు నీవుయిక్కడ హరికీర్తన చేసిన మాత్రముననున్ను, భగవంతుని సుగుణాతి శయములు మావద్ద చెప్పినంత మాత్రము చేతనున్ను మాపై ఏలనుగ్రహముకలుగునని మీకు గొప్ప సందేహము కలుగ వచ్చును. నేను మనవి చేసుకుంటాను! వెనుక రావణాసురుక్తై రామావతారంబెత్త లేదా? దశావతారంబులీరీతిగా నెత్తలేదా? గాన (పాపీచిరాయువుః— అనునట్లు నార్యోక్తి మొర లిడుచున్నది. గానభగవంతుడు వారివిషయమై (శౌర్యంసదాదుర్జనేః— నీతిన్ని ననుసరించి సమయమువచ్చువరకు కాచియుంటాడు గాన యింత టితో ముగించదలచి యున్నాడను భగవంతుని చారిత్రంబున్ను, సత్పు రుషుని కధయు ముందు యున్నది గనుక చెల్లూరినాధుని ఒక్కసారికర తాళంబులచేత మనమందరము వేడుకొనుటకు సమయమిదే గనుక త్వర పడండి లెండి॥



## 7—వ కథ. మూఢునిఅద్భుతము.
### చమత్కారమైనది చూడతగినది.

ఒకగ్రామమునందు ఒకయిల్లాలునకొక పుత్రుడుగలడు చిన్న వయస్సులోనే ఈపిల్లవానితండ్రిచనిపోయెను. వీడితల్లి ఒకఉద్యోగస్తుని దగ్గిరవంటకప్పగించెను. పిల్లవానితో నాయనా యని బుద్ధులు చెప్పట (వింత) నాయనా పంతులుగారు ఏవేళయందు నీవుచేయుపదార్థములు తిని సంతోషించుతారో నీవుచేయు మంచి కార్యములుచూచి సంతోషించుతారో అప్పుడు నీవు (*Promotion.*) అనగా జీతము ఎక్కువచేయమని కోరుట, కోరవలెను. అనియీప్రకారముగా తల్లిబుద్ధులుచెప్పి పంతులుగారి దగ్గిర వప్పగింత పెట్టెను యీయన ఒకగ్రామాంతరము వెళ్లుట తటస్థించెను యీపిల్లవాడు కూడావెళ్లెను. ఒకచోట బసచేసెను యికను పంతులుగారి అడావడి (*Make the cooking soon.*) అనగా త్వరలో వంటకావలెనని యీయన చెప్పి వెళ్లిపోయెను ఇకను పిల్లవాడు ఎసరుపెట్టి బియ్యము ఎసరులోపోసి కొంతసేపైన తరువాత ఒక సందేహము గలిగెను. ఏమన! యింటివద్ద అమ్మ అన్నము వార్చి యిత్తడిసిబ్బి మూతవేసి అందుపైని కొంచము నిప్పులుపోసెడు పద్ధతియున్నది. అని కొంతధైర్యము తెచ్చుకొని (అతిచిత్రము) యిప్పుడు వంట త్వరలో కావలెను గనుక అని గరిటెడు నిప్పులు పచన మవుచున్న యన్నములోజారవిడిచెను విడిచి, త్వరలో పంతులుగారుమీరురావడమే యాలస్యమని చెప్పెను, చెప్పగా అపరిమిత సంతోషియై త్వరలోవచ్చి కూర్చుండి భోజనపదార్థములు చూచుచుండు సమయములో బొగ్గుల న్నముతీసుకువచ్చి భోజనపాత్రయందు వడ్డించగా పంతులుగారుచూచి ఫకాలున నవ్వగా యీపిల్లవాడుయిదేసమయమనుకొని (*Promotion*) ప్రమోషన్ అనగా జీతము వృద్ధిచేయుమని కోరుచున్నాడు. యిదివరలో తల్లిగారి బోధన కారణము గనుక కోరుచున్నాడు అంతటపంతులుగారికి ఒకగ్రామము వెళ్లుట తటస్థించెను అప్పుడు బజారువాడకం

పోఁడవలసివచ్చెను. (చిత్రము) యజమాని మజ్జిగతెమ్మని రెండుబేడకాసులుయిచ్చెను. యీపిల్లవాని కొంతదూరము వెళ్లినతరువాత గొప్పసందేహముగలిగెను. ఎట్లనఁగా ఆహా! నాకుమజ్జిగకు యిచ్చిన బేడయేది నేతికిచ్చినబేడయేది అనిసందేహముగలవాఁడై వెనుకకు మళ్లినవాఁడై యజమానిదగ్గిరకు రెండుబేడకాసులు తీసుకవచ్చి పారవేసెను. పారవేయగా నిశ్చేష్టుఁడై ఏమిటిఅని అడిగెను. యితనికికలిగిన సందేహము చెప్పగా సంతోషించినవాఁడై ముప్పదిరెండుపండ్లు తెరచి పకపకనవ్వెను. నవ్వగా పంతులుగారు (*Promotion*) అనగా జీతమువృద్ధిచేయమని పిల్లవాఁడు కోరుట యీపిల్లవాని సంగతి గురించి ముందుచక్కఁగా ఆలోచింతము (జ్ఞాపకం) హరికథ జరుగు సమయములో కొంతమందికి తెలియుడం అరుదుగదా! ఏమన పెద్దమ్మవారు ప్రవేశించి ఆశ్రయించుకుని యున్నప్పుడు పిల్లవానికిబేడకాసులుదగ్గర సందేహంగల్గినటులనే హరికథముగిసినతర్వాత మీరుఅక్కడ ఆలాగుచెప్పినారు అదితప్పు యిదితప్పు మీరు కొన్ని గ్రంథములు చూచిన బాగుగానుండును గదా! యని చెప్పెదరు చెల్లూరి గోపాలుని మదిలోనమ్మి నానేర్చుకొలది తప్పులో ఒప్పులో చెప్పితిని గాన లోపములు మన్నించెదరని నమ్ముచున్నాఁడను.



8—వ కథ. భ్రమలనువిడనాడుటకు కారణములు, నశ్వప్రవర్తించునది.

ఒక గ్రామమునందు ఒక బ్రాహ్మణుండు గలండు. యీయనకు నాశికేచూర్ణము పీల్చేడుయలవాటు అనగాపొడుముపీల్చేడు యలవాటుయీయన ఒకరోజునతనగృహమందున్నరుగుమీంద కూర్చుండెను. కూర్చుండగా! ఆదారిని నొకబ్రాహ్మణుండొకండు బయలుదేరిపోవుచుండెను. పోవుచు రొంటినొకనిమ్మకాయొకటిపెట్టుకొనిపోవుచుండెను. అదియీబ్రాహ్మణుండు చూచి (అహొశాస్త్రిణః భవతాం నమస్కారః— అని యీప్రకారముగా స్వాగతమిస్తుడు పలికెను. (అహొశాస్త్రిణః భవతాంనమస్కారః— అనియీప్రకారముగాయిద్దరును, కుశలప్రశ్నలు చేసుకొనిరి. (వినోదము) (త్వంద్దరుశనేన అహంకృతార్థోస్మి:— అని మాట్లాడుచు రెండుమైళ్లవరకు వెళ్లెను. రెండవవానికి ఒకసందేహముగలిగెను. యెట్లనంగా, మనలనుకొట్టిగుడ్డా, మొదలైనవి పుచ్చుకుంటాడ ఏమీ, అనిసందేహముతోనుండెను. కాని పెదవులు,ఆరిపోయినవి. నాలుకఎండికొనిపోయినది, గద్గదస్వరముతో, మాట్లాడుచు చెల్లూరి గోపాలునిమదిలోదలచి భయముతో ఒకమాటబలికెను, అయ్యా! తమరుముందుపూరువెళతారాయనిన్ని; యింకాఎందాకావస్తారనిన్ని; నడిగెను, నేనుఎందాకాను రాను నాకుకొంచము పొడుముపట్టుదయచేయండని అడిగెను. అయ్యో! నిష్కారణము యీయనను, చూడండి? (వింత సంగతి) నిమ్మకాయను జూచి పొడుముయని మనస్సులో దలచి యింత దూరము వచ్చినాడు. అయ్యా! యిది నిమ్మకాయ పొడుము నేనుపీరచను. నాకు అక్కరలేదు. అనిచెప్పగా సిగ్గుపడి యింటికి వెళ్లెను, కాబట్టి వినుచున్న "సజ్జనులారా! సుగుణ కళ్యాణుని చరిత్రంబు చెప్పుచుండగా ఇంత మందిలో కొంతమందికి సందేహము కలుగవచ్చును. ఏమన్న,యింతటి చేతనాముక్తి గలుగడం, కాశీ, రామేశ్వరం, వెళ్లి స్వామిదరుశనముచేస్తేకాని ముక్తి లేదను మహానుభావుల అభిప్రాయము భగవంతుడు ఏమ

ని చెప్పుచున్నాడు. (మద్భక్తా యత్ర గాయంతి తత్రతిష్ఠామి నారదా:—
అను నార్శ్లోక ప్రకారం తమకు చెప్పనేల; నేను ఆలాటి స్థల మందే
యుంటానని చెప్పియున్నాడు. గాన నిమ్మకాయజూచిభ్రమపడివెళ్లిన
మహానుభావునకు ఏమిలభించెనో; కాబట్టి మూర్ఖులకు బోధించుట కష్ట
ము. గాన మీవంటిమహానుబావులకు విశదమేగాన యింతటితో ముగిం
చ దలచియున్నాడను.



## 9—వ కథ. సంతోషమైనది.

హరిభక్తికొనుహొని రమ్మన్నసాధురాలు.

ఒకగ్రామము నందొక సాధురాలు గలదు. అమెతనకునిమిటి
తో నాధా నాకోర్కెలు తీర్చుటకుగదా! మిమ్ములను వివాహ మాడితి
నని పలికెను. గాన నాఅభిప్రాయ మేమన ప్రపంచములో ఎక్కడనైన
ను. హరికథ అమ్మెడుచోటనైనను ఎంతప్రయ ప్రయాసపడి నైనను. కొనితె
చ్చి నామనోభీష్టము. తీర్చుటకుసమర్థుడవు నీవనిపలికెను. ఆమాటచెవిని
బెట్టి అట్లైతే బయలుదేరి వెళ్లెదను. అని బయలుదేరి నానా దేశములు
తిరుగు చుండగా! ఒక గ్రామము నందొక యిల్లాలు యీయనను జూచి
బ్రాహ్మణుండా మీదేవూరు ఎక్కడికిబోవు చున్నారని పలికెను.అంతట
బ్రాహ్మణుండు మంచిది అన్నిగ్రామములు మావని చెప్పెను. చెప్పగాప

కాలున నవ్వినవాడై ఏమిషాః మీద తిరుగు చున్నారని యడిగెను (మంచిసెంగతి) నాభార్య హరికథ కొనుక్కొని రమ్మన్నదని చెప్పెను అంత నవ్వినవాడై నావద్దనున్నది రండని చెప్పెను. చెప్పగా అపరిమిత సంతోషితుడై యిమ్మని అడిగెను. అతగి కూర్చుండెను. తరువాత హరికథా? హరి భక్తి యాయనెను. యే దేనా? సరే, యనిపలికెను. అంతటఆమె. వేయిరూపాయలు ఖరీదుయని చెప్పెను. మంచిది. (ఇక్కడ చిత్రము) యింటో యున్నముసలి పందికొక్కును పట్టుకుని కాళ్లకు ముచ్చలుకట్టి నొకపెట్టిలో పెట్టియిచ్చెను. యివ్వగా మహాసంతోషముతో తీసుక పోవుచుండెను. పోయి తనవూరిచేరి భార్యగారిచేతులలో పెట్టెను సంతోషించినదై మూతవూడదీసెను. తీయగ గలగలలాడుచు పైకివచ్చెను. పకాలున నవ్వినదై యిదేమిటి? యిదేనా? హరి భక్తి యని యడిగెను. అనగా అవును, అవును, యిదేయనెను, (కఠినచిత్తుమనసుకరిగింపగా రాదువిశ్వదాభిరామవినురవేమా:— అనునట్లునీతిపదము అందరకువిశదమేకానినాద్భాయిదొక పందికొక్కు యనెను. గాన యీపద్యముయొక్క అభిప్రాయమునకు నాభార్యయే తగియున్నదని వీడనుకొనెను. కాబట్టి సజ్జను లారా! తనకు లోకజ్ఞానము లేకపోయినప్పుడైనను యితరులు చెప్పితే వినవలయును ఇదిపంది కొక్కని చెప్పితే కోపము వచ్చెను కాబట్టి హరికథలోకిరమ్మంటె రావడం జరుగుకాలములో యీలాటి కారణములచేత లేచిపోవడముగాన లోపములను భరించుటకు బెల్లారిగోపాలుడేగాన క్షమింపుడు.

## 10—వ కథ. చదువుకొన్నమూఢుడు అతిచిత్రము.

### అలవిలేని సంతోషము.

ఒకగ్రామమందు సమస్తశాస్త్రములు చదువుకున్న బ్రాహ్మణుండుగలడు యీయనయాచననిమిత్తంపరదేశములయందు చేరివెళ్లెను. చాలాకాలమునకు స్వదేశమునుండి స్నేహితుడు కనుపించెను. ఓ ప్రియ స్నేహితుడా! మన దేశంబున విశేషమేమనియడిగెను. అంత నాస్నేహి



తుడు ఏమనిచెప్పదు నోరుగాకున్నది మీవంటిమహానుభావులకు తగ్గ కష్టము కాదని చెప్పుతూ (చిత్రము) చిన్న వయస్సులోనున్న మీభార్య గారిపైనిమిటిచనిపోయెనట ఆమెకువైధవ్యము తటస్థమయ్యెను. యింతకన్న మరేమివిశేషములు లేవనిచెప్పెను. అంతనాబ్రాహ్మణుడు మూర్ఛపడి లేచిఆ! సఖీయనివెక్కివెక్కియేడ్చుచుండెను అయ్యో! నేనుబ్రతికియుండగానే యిటువంటిదుర్దశ నీకేలతటస్థించినదని మిక్కిలిదుఃఖించుచుయింటికి ప్రయాణోన్ముఖుడై వచ్చుచుండగా! మరియొక స్నేహితుడు కాన్పించి మాట్లాడు సమయములో ఆయనతో నాభార్యకు వైధవ్యముతటస్థించినదట నీవెరుగుదువాయని అడిగెను అంతఆలోచించినవాడై యిట్టిమాధులు, లోకమందుంటారని ఆలోచించి అవును నిజమేకాని(రెండవసంగతి) యిక నొకసంగతి జరిగినది ఏమన మీతండ్రిగారు మీపెద్ద కుమారుని నెత్తికొని చనిపోవుటకు సిద్ధముగానున్నాడని యేడుస్తూయున్నాడు.అని చెప్పెను. యిక్కడ సందర్భమేమన యీశాస్త్రుర్లవారి తండ్రిగారు యీయన దేశాటనకి వెళ్లినప్పుడే పరలోకప్రాప్తికి వెళ్లుట యీయనమెరుగున్నసంగతియె. ఈరెండు దుఃఖములచేత ప్రపంచ జ్ఞానము మరచిచెల్లూరి గోపాలా యెంతపనిచేస్తివి ఏడ్పించుటకు నేనాదొరకినానని అనుకుంటూయుండగా త్వరలోవూరుకాన్పించెను. గోలున యేడ్చుచూయిం

ట్లో ప్రవేశించెను యీయనను చూచి అందరు మెచ్చిరి వీడు ఎవ్వరికి తెలియదు కాని సువాసినీగానున్న భార్యనుజూచెను. కుమారునిజూచెను యింకా మెచ్చుచుండెను. అంతటకొంత సేపటికి యిష్టాగోష్టి మాట్లాడు సమయములో తానువిన్నసంగతి అంతా చెప్పెను అంతట భార్య నవ్వినదై నాధా, మీరుసమస్త శాస్త్రములు చదువుకున్నవారై యుండగామీరుప్రతికియుండగానాకేల వైధవ్యమేల సంభవించును వీలయిట్టిపిచ్చిమనస్సు గలిగెను అనిభార్యఅడిగెనుతలవంచుకునిసిగ్గుపడి ఏమియుచెప్పకూరకుండెను. సభికులారా, హరికధలోకివచ్చివృధాకాలక్షేపముచేయువారువారికి తెలసియున్నప్పటికి యిక్కడయీలాగు చెప్పినాడు యీయనకు గ్రంథము తెలియదు అనువారు యీచదువుకున్న మూఢునితో బోల్చుటకుకథా సందర్భమునుబట్టి చెప్పితిగాన యింతటితో ముగించదలచియున్నాడను.



## 11—వ కథ. ఆహ్లాదమైనది.

హరికథలోకి రాని మూఢుడువచ్చుట.

ఓ సభికులారా; హరికథ వొకగ్రామములో జరుగు చున్నది.

ఆ గ్రామములో నొకగృహస్థుఅను బ్రాహ్మణుడుగలడు ఆయనచిన్ననాటై
నను చదువునేర్వలేదు. చదువుఅన్నసంగతి ఆయనకు తెలియునే తెలియదు
అయినప్పటికి? పెద్దలు చెప్పడమేమన (జ్ఞానం విహీనఃపశుః — అనునా
ర్యోక్తిని అందరకు విశదమే, గానయీయనభార్యగారు అందరు బూడి
దెలో నొకవేలుపెడితే యీమె రెండువేళ్లు పెట్టినది యీలాగుయుండ
గా నొకనాడారాత్రి ఏర్గ్రామములో నొకరియింట హరికథ కాలక్షే
పము చేయుచున్న సమయములో ఈబ్రాహ్మణుడు. అక్కడికివెళ్లి యి
క్కడ యింతమంది కూర్చున్నారు ఏమి? సంభావన యిస్తారాయని నడి
గెను. కాదనిరి అదివుంటె వుంచామనిన్ని లేనియెడల ఎందుకని అనుకొను
చుండగా యందులో నొకరు యిక్కడ సంభావన యివ్వరు. యిక్కడ
హరికథ జరుగునని చెప్పిరి. బ్రాహ్మణునికిసారము తెలియక యింటికివెళ్లెను
వెళ్లిపరుండబోవు సమయములో భార్యగారుచూచి నాథా! నొకచోట
హరికథ కాలక్షేపము చేయు చున్నారు. వెళ్లుమని చెప్పెను. చెప్పగా
నాకు తెలియదు తెలియక పోయినా వెళ్లుమని చెప్పెను. అయ్యో! నాకు
నిద్దుర వస్తుందని బ్రతిమాలు కొనెను. నిదుర రాకుండా మందు యిస్తా
ననెను. యిమ్మని అడెగితీసుకుని దీని యుపయోగము చెప్పుమని నడిగెను.
నిదురవచ్చు నప్పుడెల్ల కంట్లో బెట్టుకోమని యిచ్చెను. పుచ్చుకొనిబయలు
దేరి పోవునంతలో భార్యగారుపిలిచి నాథా! శ్రద్ధగావినిరమ్మని కోరెను
వెళ్లి నొకచోట గూర్చుండి మరి కొంతసేపటికి ఇతడు సుకుమార శరీ
రము గలవాడు గనుక నిదుర వచ్చెను. వచ్చినప్పుడెల్ల మందు కంట్లో
బెట్టుకొను చుండెను కండ్లమంట నీళ్లువోడడం యీలాటి అవస్థలచేత
కాలక్షేపము చేసెను హరికథ ముగిసేటప్పటికి మందు అయిపోయినది
పైమీద కండువా తడిసెను కట్టుకున్న గుడ్డ తడిసెను. తెల్లవారు సమ
యములో కండ్లు మంటచేత ఇంటికిరాజాలక మెల్లగా వస్తూదీని జిహా
నిక్షిపిడుస్తూవచ్చి గుమ్మములో అడుగుపెట్టునంతలో భార్యగారునాథా
హరికథ నేలాగునున్నది? అనికుశలప్రశ్న చేసెను హరికథ రెండుగుడ్డలు

తడిసినవి. కండ్లు మండు చున్నవి యివి విశేషములని చెప్పెను ఓసజ్జను లారా, హరికథ జరుగు కాలములలో మీరు ప్రయత్నము చేయకనే ఇట్టిమూఢులు తటస్థ మవుదురని చెల్లూరి గోపాలుడు నొకభక్తునితో చెప్పినట్లు వినుచున్నాడను తటస్థమవుటకు సందేహమేమున్నది ముందు సందర్భములో పూర్తిచేసెదను.



## 12—వ కథ. నీతిమార్గము, చిత్రమైనది.

### భగవంతుని తెలుసుకొను మార్గము.

లోకములో నొకపిల్లవానితండ్రి చిన్నతనములో యీపిల్లవానికి వైదీకపు వృత్తి చేతను జీవనముచేసి ఈపిల్లవానికి చదువు చెప్పించెను. ఈపిల్లవాడు చదువ (*B.A.B.L.*) అనగా బి,యే, బి,యల్, పరిక్షలో గెలుపొంది గొప్ప వుద్యోగములో ప్రవేశించెను వీడువుద్యోగముచేయు చుండగా పుత్ర వాత్సల్యము చేత చూచుటకు బయలుదేరి వచ్చు చుం డెను. వీడి ఉద్యోగపు చిన్నలు ఉదయమున కాపీ పుచ్చుకొనుట రెండు ఘంటలకు తిను బండారములు మధ్యాహ్నము సాయంత్రము భోజనము చెయ్యడము ఇట్టిఏర్పాటుయుండుటఆశ్చర్యమా కాదు తండ్రిగారు వై దీకమునందే కాలముగడపినవారుగనుక చేతులోచెంబున్నూ వంటినిండా విభూతియును కంఠమందు రుద్రాక్షలు మొదలైన వైదీక ధర్మములన్ని యీయనయందే కనుపించుచున్నవి. ఆపద ద్భాంధవుండైను ఆశ్రితవత్స

లుండుననగు చెల్లూరి గోపాలుని స్మరియించుచు యీప్రకారముగా బ
యలుదేరి వస్తూ యీయన బసలోగిట గుమ్మములో అమగు వుంచుతరి
యీయన స్నేహితులతో మాట్లాడు చున్నారు. స్నేహితులు ఆవచ్చు
వా రెవరనినడుగగా యెవరో వైదీకి అనిచెప్పినారుకాని మాతండ్రిగా
రనిచెప్పుటకు యెంతమాత్రము నోరు రాదయ్యె ఆహా మన మందరము
ఆలోచించతగ్గ హంశమొకటియున్నది. యేమన (*Pingali set.*) పింగా
ళిశెట్టేలరేదేల జారీచెంబేలయని సందేహమై యుండవచ్చును గాని ఆ
టులనుట ఆశ్చర్యమా ఆశ్చర్యముః కాదు ఆమాట చెవిని బడ్డవాడై ఓరి,
దురాత్మ ఓరిదుర్మార్గుడా, నేను, తిలదానములు పీనుగులు మోసి శ్ర
మపడినీకు చదువుచెప్పించి నందుకు వెంటనే ఫలితార్థము నాకులభించి
నది. అని గిర్రునతిరిగినవాడై అక్కడయుండకబయలుదేరి ఇంటికివెళ్లెను
సజ్జనులారా, కొంతమంది తల్లిని, దండ్రిని, యెరుగని మూఢులై యు
న్నారుగదా భగవంతుని తెలుసుకొనుట కెంతకాలముపట్టునో మనమం
దరమూ ఆలోచింపవలసి యున్నది వొకసారి మనమందరము భగవం
తునిగూర్చి మనకు ఇచ్చిన చేతులతో కరతాళనము చేయుట ముఖ్యము
యెట్లన (కరమావృ నర్చించు కరములు కరములు శ్రీనాధు వర్ణించు
జిహ్వజిహ్వః— అనునట్లు వొక్కసారి (నారాయణంనారాయణః—
అనిపలుక ఇదిసమయము ఇంతటితో ముగించెదము.

## విజ్ఞాపనము.

ఓసభికులారా నేనొకమనవి చేయుచున్నాను. మీరు మాట్లాడే మాటలకు సందర్భము కుదురునో కుదరదోయని ఆలోచించు చున్నాడను యేమన నావద్ద ఫిడేలు మద్దెలవగైరాలు యొక్క ధ్వనిచేత మీమాటలకు సందర్భము కుదరదోయని నేను విచారించు చున్నాడను.

## 14—వ కథ. భక్తికల్గించునది.

### భక్తుని త్రోవ వేరు.

నర్మదాతీరమునందు వొకహరిభక్తుఁడుగలడు యితనునిత్యంకేశ

వ, మధుసూదన, నారాయణ, యనుచు నిత్యంభజనచేయుచుండెవాఁడు. ఈతీరున భజనచేయుచుండగా నొకనాఁడా భక్తుడు భజనసేయు కాలంబున నలుగురుమనుష్యులాదారినికలసిపోవుచుండిరి. వీరులోవీరు ఈయనకు భక్తివేలనివీరిట్లుఅనుకొనిరి. యితని యీస్థానమునుంచి తొలగించుట మన తెలివిఅని ఆలోచించి ఓరి హరిభక్తుండా! యీదైవ భక్తియేల! ఇదిఎందుకు నీవున్న మావలె ఏదోవృత్తిలో ప్రవేశించిన అన్నమునీనవచ్చును. అనుచుమాట్లాడుచు పిలిచిరి. యీయనవీరిని చూచినవాఁడైచూడగాదుర్మార్గులని అలోచించి నాయనలారా! ఏదోవృత్తియందుతిరుగుచున్నాడను. గాన. మీవృత్తియేమనియడిగెను ఒకడుచెప్పుచున్నాడు.. ఎవరేనా పిల్లలతోనుండియున్నవారినిచూచి సహించలేని గుణముగలవాడను యనిచెప్పెను. అంతటహరిభక్తుడు, అవును మొదటిదుర్మార్గుడవీవని అనుకొనుచుండగా యీలాగున అందరుతలొకటిచెప్పెను. యీభక్తుండు, అయ్యో! అడవియందుండినను (రాకిన్‌మానవు హానివృద్ధులుమహారణ్యంబులోడాగినగ।పోకన్‌మానదు దేహమేవిధమునన్‌పోషించిరక్షించినన్:— అనునట్లు. ఎక్కడయున్నను, అడవియందున్నను, వచ్చెడు ఆపదలరాక మానవనుకొని. నిశ్చయము చేసుకొని తదేకధ్యానముగానేయుండెను. భక్తిమానలేదు. వీరితోకలసి మెలసియుండెను. ఎటువలెకుమ్మరిపురుగున్యాయముగా గాన యిక్కడనే వీరువుండియీయనవలెనేభక్తులోదిరిగి, దుర్మార్గమునువిడిచిరిగాన యిక్కడసందర్భముబట్టి మనమాలోచింపవలసిన దొకటియున్నది, ఏమన. మూఢులవల్ల. భక్తులకున్ను, భక్తులవల్ల మూఢులకున్ను, భక్తికలుగుటకు సందేహములేదు, గాన ఒకమూఢుడు చెల్లూరిగోపాలుని ఉదయము మొదలు సాయంత్రమున్ను, వేడుచు తుదకుపరమపదవినొందెను. గానమూఢభక్తియే ముఖ్యమైనదని పురాణములుసహామొరలిడుచున్నవి ముందుకథాసందర్భముగాచెప్పి తరువాయిముగించెదను.

## 15—వ కథ. చూడతగినది.

### పతిభక్తికిలోపములు.

పూర్వకాలమునందు పతిభక్తిగలస్త్రీయొకటియుండెను. ఆమె, తోడివారితో సహవాసముచేయుచుండగా ఆగ్రామములోపతిభక్తిలేని వొకస్త్రీ ఆగ్రామమునందు గలదు. యీయిద్దరు, వొకరోజు కలసి మాట్లాడుచుండగా! పతివ్రతా శిరోమణిని, పతిభక్తిలేని, ఆమె. మీయింటి వారివిశేషములేమని యడిగెను. ఏమిచెప్పుదుయని, తలవంచుకొనిసిగ్గుపడుచునిట్లనియె! భోజనముచేసినారు. కాళ్లొత్తగా నానాధుండుపరుండె నారనిచెప్పెను, అంతటపతిభక్తిలేనిస్త్రీఏమిఃి మీయింటివారు. వున్నట్టె తలవంచుకొని మాట్లాడుచుంటివని హేళనము చేసెను! అంతటపతివ్రత మీయింటివారి విశేషంబు లేమి! గ్రామములో నున్నారః యనిఅడిగెను పహావారు, గ్రామములోనున్నప్పుడు, తలదువ్వొకొనకనుండుటే ఆనిమాలు, యిక్కడసందర్భమునుబట్టి, పేమిటినిర్భాగ్యుడని తెలుపుచున్నది, అంతటయీయిద్దరికి మాటలతకనందున కొంతసేపటికి మాటలుముగించి వెళ్ళిపోయిరి, గానఅన్నిటికన్న స్త్రీలకు, పురుషులకు, రెండుగుణములవల్ల- కీర్తికాములగుదురు, గనుక యిది పతివ్రతాశిరోమణియని నిశ్చయించుటకు జాగాదొరకినది, యీసుగుణములులేని ఆడువాండ్రమ రెండవస్త్రీతోబోల్చుటకుకథాసందర్భమునుబట్టి చెప్పుటవీలుగానున్నది. గాన సుగుణ కళ్యాణుండగు చెల్లూరి నాధుండు వొప్పుకొనుచున్నాడు గాన ఇంతటితోముగించి కొంతవిశ్రాంతిపొందెదము గానహరికధలలో, హరిశ్చంద్రునిభార్య కుచేలునిభార్యయింట్టివారిసంగతిలో యీ సందర్భమునే ను బోల్చవచ్చును.

## 16—వ కథ. చదువతగినది.

### గురువునై, దేవుడనై.

సజ్జనులారా, కాలక్షేప పరులారా! హరిభక్తులారా, యిప్పుడు! మనమొకట్టి ఆలోచించవలెసిన దొకటియున్నది, భగవంతుని గు

ణములను, దయయును , కొంత ఆలోచింపవలసియున్నని, భగవంతుఁడె టువంటివాఁడు? (వాసులహృదయంబు తగిలినాఁడో:— అనియిట్లుహస్త్రము మొరలిడుచుండగా, అనేకమంది ఇతరవృత్తులయందు ప్రవేశించి యుండుట భగవంతునికొరకే కదా, దీనినిబట్టి భగవంతుఁడేమని పలుకుచున్నాఁడు. నన్నుకనుగొనుట దుర్లభమని చెప్పుచున్నాఁడు, ఆయనను తెలుసుకొనుట కొకనుపాయమున్నదనినొకభక్తుఁడుచెప్పుచునాఁడు (పరము సాధింపను బ్రహ్మవిద్యయేవిద్య:— అనియున్నదని చెప్పియున్నాఁడు. గాని, కొంతమందికి సందేహముకలుగవచ్చును, ఏమి, కేవలముపరచింతయందే కూర్చుంటె భార్యసుతాదులకున్ను, సంసారాదిక నియమములు జరుగవనియందురు నొకనుపాయమున్నదని మరొకభక్తుండు మొదటివాడిఅభిప్రాయమునుబట్టి ఏమంటూయున్నాడు. (ఇహముసాధింపను హేమవిద్యయేవిద్య:— అనునట్లుగా మొదటిదానినినమ్మి రెండవదానిమార్గము విడువకుండా నుండవలెనుగాని యీవన్ని శాశ్వతములుగావుకాన (ఎలమినీ తారకనామంబు తెలియలేక:— అనునట్లుగాఏదో కాలమును యేర్పాటుచేసుకొనిభగవంతునిసుగుణములను వర్ణించుకుంటూయుంటె భగవంతునిదయలోచేరుటకు కారణంబు. గాన, చేరుటవీలున్నదాయని సందేహముకలుగవచ్చును, (రామనామంబుముక్తికి రాజపథము:— అనునట్లునీతిబోధించుచున్నది గాన, ఇప్పుడొకసారి ఆశ్రితవత్సలుండగు ఆ! చెల్లూరినాథుండగుగోపాలుని కరతాళంబులచేత వేయుట పరమధర్మమైనపనిగనుక (నందబాలంనవనీతచోరం బృందావనసంచారం:— అనిహరిస్మరణచేయుదము, కరతాళంబులు ప్రయోగింపుదము.

## 17—వ కథ. అందరుచదవతగినది.

### భగవంతుఁడుదయగలవాఁడు.

ఈప్రపంచములో ఒకభక్తిహీనుఁడుగలఁడు. ఆయన్ను ప్రతిరోజున ఆ గ్రామములోనుండు దేవాలయమునకు ఎదురుగా కూర్చుండి, విష్ణుదర్శనమునకు బోవువారినిచూచి నిందించుచుండెవాఁడు, ఇట్లుండ ఒ

కనాఁడావాఁడుమాములు ప్రకారముగావుండెను యిట్లుండగొంతమం
దిభక్తులుకలసి యీదుర్మార్గునకేమి, యిట్టిసహించలేని గుణముగలవాఁ
డైయున్నాఁడని ఆలోచించుచుండగా, అంతటయీతనికి నొకకుమారు
డుగలిగెను. యీపిల్లవాఁడు దినదినమునపెరుగుచుండెను. కొన్నిదినము
లకుప్రాజ్ఞుడైయ్యెను, అంతవీనితండ్రి నాయనా, నీవు చదువుకోవలెనని
చెప్పి నొక సుపాధ్యాయునినొద్ద నప్పగించెను, వప్పగించగా, సమస్త
శాస్త్రములు చదివినవాఁడయ్యెను. నేర్పుగలవాడయ్యె! గానితండ్రిగారు
యొక్కసుగుణము మాత్రము ఈపిల్లవానికి అంటలేదు. తరువాతయీ
భక్తులు అందరుకలసి దేవళంబులోకి వెళ్ళుచున్న సమయములో ఈబుడు
తడుకూడావారితోకలసి వెళ్లుచుండెను. అంతటఈదుర్మార్గుడు ఎప్పటి
చోటుననే కాచియుండెను. ఈయనకుమారునిజూచి, నాయనా, నీకు
కూడాయిట్టివెఱ్ఱిగలిగెనా; యనిబిగ్గరగా కేకలువేసిచెప్పెను.అంత ఈపి
ల్లవాఁడు, ఏమి? చెప్పలేకూరకుండిలోపలికిన్, పోయెను. అంతటదీనసం
రక్షకుండున్న, శ్రీవల్లూరిగోపాలరూపుండుననగు సర్వేశ్వరుడు ఈపిల్ల
వానియందు తనమాయకప్పి వేసి కనఁబడకుండా చేసెను. యీభక్తులం
దరు. భగవంతునిగుణములకు ఆశ్చర్యమునుపొందినవారై ఎవ్వారియింటి
కి వారుపోవు సమయములో, అయ్యలారా, భక్తులారా, నాచిరుతబు
డుతడేడీ? యని, వీరినినడుగగా ఈబుడుతడను, మేముఎరుగము, మీచిన్న
వాఁడు. మాతో రాలేదని సమాధానముచెప్పిరి. అంతటవీడు. భగవంతు
ని, మాయవేయనితెలుసుకొని. యిక్కడసందర్భమును. బట్టిమీకుసందే
హముకలుగవచ్చును, ఏమనమొదటదేవుఁడంటేనే ఒప్పుకొననివాఁడు.భ
గవంతునిమాయయందె నమ్మకమేలాగలిగెనని మీరనవచ్చును (కంద. కీ
టకముదెచ్చి భ్రమరము। పాటవమున బభ్రమింప భ్రాంతంబైత। కీ
టకము భ్రమర రూపము, పాటించు వహించుగాదె । భయయోగము
నన్:— ఈపద్యముయొక్క అభిప్రాయము తమకే విశదంబుగాన నేను
వేరెచెప్పనక్కరలేదు. అయినను నాజిహ్వా చాపల్యముచేత కొంతచెప్ప

ప్రయత్నించెదను. పేడపురుగును నొకతుమ్మెదతీసుకవచ్చి, తుమ్మెదరూపము చేయుచందమున పిల్లవాఁడుఎప్పుడుగుడిలోకి వెళ్లి నాడో, అప్పుడునీవు వెళ్లవద్దనిచెప్పినాడో, అప్పుడేజ్ఞానముకలుగుటకు కారణముయని యోచించుట కవకాశముగలుగుచున్నది. గాన యిప్పుడుసందర్భమేనకాతేదు భక్తులారా, భగవంతునిమాయలు భక్తులకెరుకేగదా! మూఢులకేమి ఎరుగ గానమీరుచెప్పుడని వేడుకొనెను. అంతటఈదుర్మార్గుడు, లోపలికి వెళ్లువారినిచూచి నిందించు. భక్తిహీనుడు. విరాట్పుస్వరూపుండగు. నా విష్ణుని వేడగాను నామము తలచినంత మాత్రముచేతనే పిల్లవాఁడు కనపడెను, యికను సేవించినను, పాడినను ఎటువంటి సంగతులు కనపడునో ఆలోచింపుడు, సభికులారా, భక్తిహీనులకు నైనా భగవంతునిచరిత్రంబుచెప్పుటలో భక్తికలుగుటకేమిసందేహమేమున్నది గానభక్తిలేనివారు మొదటి భక్తిహీనునితో బోల్చుటకేమి సందేహమున్నది. వేరెచెప్పనేల, తుదకు జ్ఞానము సంపాదించెను. గానయింతతో ముగించతలచియున్నాడను.

గద్య.

ఇది, శ్రీమదఖండ తపః ప్రచండ ముని ప్రకాండ మండలీ మండన శాండిల్యసగోత్రపవిత్ర శ్రీగరిమెళ్ల వంశపయఃపారావార రాకా కైరవమిత్రజ్యోతిఃకలారహస్య తత్వజ్ఞవరగౌరవ గవరయార్య పుత్ర పేరమాంబా గర్భశుక్తి ముక్తాయమాన విబుధ జన విధేయ శివరామ నామధేయ ప్రణీతంబైన - చెల్లూరు - శివరామదాసుచేసిన యితిహాసమంజరిసర్వంబును, సంపూర్ణము.

క॥ఇదిచదివెడువారలకే।కొదువలురాకుండుశ్రీయుఁగోర్కెలునొసగుఁ।
పిదపను మోక్షంబిచ్చును సదనులహృదయుండుసార సాక్షుండెలమిఁ॥



# పుస్తకములజాబిత.

| | | | |
|---|---|---|---|
| శ్రీమన్మహర్షి గౌతమప్రణీత ధర్మసూత్రము హరదత్తవిరచిత మితాక్షరీవ్యాఖ్యాన సహితము | ౧ | ౮ | |
| శ్రీత్రిశతి శంకరభాష్య సహితము. | ౧ | ౧ | |

## డ్రామాలు.

| | | | |
|---|---|---|---|
| రోహిణీ సుధాకరవిజయం | ౦ | ౧ | |
| నర్మదాపురుకుత్సీయం | ౦ | ౧౨ | |
| మనోరమ | ౦ | ౧౨ | ౦ |
| ప్రబోధచంద్రోదయం | ౦ | ౧౦ | ౦ |
| చండకౌశికం | ౦ | ౮ | ౦ |
| కల్యాణకల్పవల్లి | ౦ | ౮ | ౦ |
| రాగమంజరి | ౦ | ౮ | ౦ |
| శశిరేఖ | ౦ | ౬ | ౦ |
| సాగరిక | ౦ | ౬ | ౦ |

## హరికథలు.

| | | | |
|---|---|---|---|
| ప్రియంవద | ౦ | ౬ | ౦ |
| అంబరీషోపాఖ్యానం | ౦ | ౪ | ౦ |
| గోపికావస్త్రాపహరణం | ౦ | ౪ | ౦ |
| విప్రనారాయణచరిత్ర | ౦ | ౫ | ౦ |
| శ్రీరామజననం | ౦ | ౧౨ | ౦ |
| కుచేలోపాఖ్యానం | ౦ | ౮ | ౦ |
| కర్ణచరిత్ర | ౦ | ౮ | ౦ |
| అజామిళోపాఖ్యానం | ౦ | ౩ | ౦ |
| శ్రుతదేవ్యసిచరిత్ర | ౦ | ౪ | ౦ |

ఇవిమొదలైన సంస్కృతాంధ్రగ్రంథములున్ను స్కూలు పుస్తకములువగైరా కావలసినవారు రాజమహేంద్రవరమందుండు కర్రా అచ్చయ్యగారికి వ్రాసి తెప్పించుకోవచ్చును.

